THE ANDHRAPATRIKA_MADRAS.

విద్రముగ నున్నవి! విద్రముగ నున్నవి!
హకల్ బెరీఫిన్
(మార్క్‌ట్వేన్) వెల రు. 2-0-0
అనువాదం: నండివారి రామమోహనరావు.
ఆంధ్ర గ్రంథమాల, పోస్టు బాక్సు 212, మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక

3/83/28

జీవన్ముక్తి ప్రబోధక సభలు
పునర్జన్మ రహితమగు జీవన్ముక్తి విషయము కర తలామలకముగ బోధించబడును. ఈ పద్ధతియము లకు, ఇంద్రియ దౌర్బల్యములకు లోనై యుంటివని విచారించవలదు. బోధకులు కాశీ వాస్తవ్యులు. ఎన్నే నెల 18 వరకు ఉపన్యసించెదరు. ఇష్టముగల వారు 10. 15 దినములు ముందుగనే రావలెను.
శ్రీ ఆత్మానంద బ్రహ్మచారి గారు, 67, గోవిందప్ప నాయక్ వీధి, మద్రాసు-1.

Regd. No. M, 1118 సంపుటం 39. సంచిక 168 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. గురువారం 18-9-1952 వెల 1 అణా. హాలీ 0-1-2.

# జిల్లా బోర్డుల ఎన్నికలు మరొక ఏడాదివరకూ వాయిదా



ఇందూరులో ఆదివారంనాటి ఎ. ఐ. సి. సి. సమావేశంలో వేదిక పైన ఆసీనులైయున్న ప్రధాని నెహ్రూ, మౌలానా అబుల్ కలాం ఆజాద్ పండిట్ పంత్ మొదలైనవారు.

## రాష్ట్రమంత్రివర్గ నిర్ణయం: శ్రీ రాజగోపాలాచారిగారి ప్రకటన

### త్వరలో కోస్తాజిల్లాల్లో ముఖ్యమంత్రి పర్యటన

మదరాసు, సెప్టెంబరు 17: ప్రస్తుతపు జిల్లాబోర్డు సభ్యుల పదవీకాలమును 1952 డిసెంబరు 1 వ తేదినుండీ మరొక సంవత్సరంవరకు సాగించుటకు ప్రభుత్వం నిశ్చయించిందని ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి ఇవ్వాళ మంత్రివర్గ సమావేశానంతరం పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

మంత్రివర్గం ఇవ్వాళ ఉదయం 10 నుండి 12-15 ల వరకు ముఖ్య మంత్రి అధ్యక్షతను సమావేశమైంది. పెండింగ్ లో వున్న బిల్లుల గురించి సెలెక్టు కమిటీ నిర్ణయాల ఫలితముగ ఏర్పడిన పరిస్థితిని, ఇంకా అనేక మామూలు పరిపాలనాసంబంధమైన విషయాలను గురించి చర్చ జరిగిందనికూడా ముఖ్య మంత్రి విలేఖరులతో అన్నారు.

ఆరు నెలల్లో చెన్న రాష్ట్రంలో సామాన్య ఎన్నికలు రానున్నవని ఆర్థిక మంత్రి సి. సుబ్రహ్మణ్యంగారు యీ నోడ్డులో ఒక సభలో చెప్పినట్టుల ప్రకటింపబడిన వార్తను గూర్చి రాజగోపాలాచారిగారిని అడగ్గా "సుబ్రహ్మణ్యం గారు కాంగ్రెసు సేవకుల సభలో మాట్లాడి ఉంటారు. వారు ఏ పరిస్థితుల్లో ఏమిచెప్పారో మనకు తెలియదు" అన్నారు.

మద్రాసు ప్రభుత్వ ముఖ్య మంత్రి చక్రవర్తి రాజగోపాలాచారి గారు కొద్ది రోజుల్లో ఆంధ్రజిల్లాల్లో పర్యటన చేయ సంకల్పం ఉన్నదని నేడు పత్రికా ప్రతినిధుల సమావేశంలో వెల్లడించారు.

### ఖోస్లా కమిటీ నివేదిక

ఖోస్లా కమిటీ నివేదిక మద్రాసు ప్రభుత్వ చీఫ్ ఇంజనీరు ఎ. ఆర్. వెంకటాచారిగారి పరిశీలనలో ఉన్నదని ఆంధ్ర పత్రిక ప్రతినిధికి తెలుస్తోంది. మద్రాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలచారి గారిని ఖోస్లాకమిటీ నివేదిక మీకు అందిందా అని నేను పత్రికా ప్రతినిధులు అడగ్గా రాజగోపాలాచార్లుగారు ఇట్లా అన్నారు. నివేదిక అందడము నేదు లేదు. కృష్ణా నదీ జలాల వినియోగాన్ని గూర్చినవిషయం ఇంకా సంప్రదింపులలోనే ఉన్నది. నిర్ణయం జరిగేవరకు సంప్రదింపుల స్థితిలోనే ఉంటుంది."

### మహాత్ముని 85 వ జన్మదినోత్సవం

#### 84 రోజుల సూత్రయజ్ఞం సమాప్తి

రాజకోట్, సెప్టెంబరు 16:— హిందూ పంచాంగము ననుసరించి గాంధిమహాత్ముని 85 వ జన్మదినోత్సవాలు రాష్ట్రమంతటా జరిగాయి. నేటితో 84 రోజుల సూత్రయజ్ఞం పరిసమాప్తమైంది. ప్రభాత ఫేరీలతోను, సూత్రయజ్ఞంతోను నేటి ఉత్సవాలు ప్రారంభమైనవి. సూత్రయజ్ఞంలో 180 సంస్థలు పాల్గొన్నవి. సాయంసమయమున బొంబాయిముఖ్య మంత్రి శ్రీ మురార్జీ దేశాయి గారు బహిరంగసభకు అధ్యక్షత వహించి రాష్ట్రంలో నిర్మాణ కార్యక్రమానికి ప్రజలు చందాలు వేసుకొని వసూలు చేసిన 46,000 రూపాయల రొక్కాన్ని అందుకొన్నారు. ఈ ఉత్సవాల సందర్భమున రాష్ట్రంలో 10,69,43,820 గజాల నేతనూలు ఉత్పత్తిఅయింది.

### కంటికురుపులో 'కవల'

టోకియో, సెప్టెంబరు 16: 19 ఏండ్ల కొరియా బాలిక కంటి మీద లేచిన గడ్డను శస్త్రం చేసి నప్పుడు దానిలో పిండరూపమున వున్న శిశువు కనిపించిందని ఒక జపానీస్ నేత్రవైద్యుడు నేడు తెలిపాడు. ఈ పిండం బాలిక కవలదైవుండవచ్చునని జననానికి పూర్వము అది కంటిలో వుండి వుండవచ్చునని ఈ వైద్యుడు అన్నాడు. పిండం పావురం గుడ్డంత వున్నది.

## ఈజిప్టులో వచ్చేనెల్లోనే భూసంస్కరణలు అమలు

### ఫరూక్ 'ఆస్తి' పంపకంతో ప్రారంభం

కైరో, సెప్టెంబరు 16: ఈజిప్టులో భూమి సంస్కరణలను వచ్చేనెలనుంచీ అమలు జరపటం ప్రారంభిస్తారనీ, ముందుగా మాజీ రాజు ఫరూక్ దీ, రాజకుటుంబీకులదీ జమీలను ప్రభుత్వం స్వాధీనపరుచుకుంటుందనీ, ఈజిప్టు ఆర్థిక శాఖ ప్రతినిధి ఒకడు ఈ రాత్రి వెల్లడిచేశాడు.

భూమి సంస్కరణలకు సంబంధించిన ఉత్తర్వులన్నీ సిద్ధమైనవి. ఇక వాటిని అమలుజరపటమే తరువాయి. ఈ సంస్కరణలు పూర్తిగా అమలు జరిగేటప్పటికి 5 ఏళ్ళుపడుతుందని అనుకుంటున్నారు.

భూమి సంస్కరణలను ప్రతిఘటించిన నేరానికిన్నీ, ఒక పోలీసుమీద తుపాకి కాల్చినందుకున్నూ అడ్లీపాలా లమ్‌టుమ్ అనే భూస్వామి ఒకడు అరెస్టుచేయబడ్డాడు. ఇతని కేసు విచారించడానికిగాను జనరల్ నజీబ్ నేటిరాత్రి ఒక మిలిటరీ ట్రిబ్యునల్ ను నియమించాడు. విచారణ రేపు ఉదయం ప్రారంభం అవుతుంది.

### సెరాజ్ ఎల్ దిన్ రాజీనామా

జనరల్ నజీబ్ చేత అరెస్టు చేయబడి ప్రస్తుతం నిర్బంధంలో వుంటున్న వఫద్ పార్టీ కార్యదర్శి సెరాజ్ ఎల్ దిన్ వఫద్ పార్టీ సభ్యత్వానికి సెనేట్ సభ్యత్వానికి రాజీనామా యిచ్చినట్లు యీ వేళ అధికారరీత్యా ప్రకటించబడింది. ఆయన సోదరులు, "అల్ నిద్ర" అనే వఫద్ వారపత్రిక సంపాదకుడు యాసిన్ సెరాజ్ ఎల్ దిన్ ప్రముఖ వ్యవసాయదారు అబ్దుల్ హమీద్ సెరాజ్ ఎల్ దిన్ కూడా వఫద్ పార్టీనుంచి రాజీనామా ఇచ్చారు.

ఈజిప్టులో రాజరికాన్ని రద్దుచేయవలసిందని కోరుతూ వామపక్షీయులే కాక ముస్లిం సౌభ్రాతృసంఘంకూడా ఇటీవల ఆందోళన ప్రారంభించింది. వఫద్ పార్టీకి చెందిన కొంతమంది యువకులు ఈ విషయమై ఈజిప్టులో జనవాక్య నిర్ధారణ జరిపించాలని కోరుతూ సైన్యానికి పిటిషన్ ఒకటిదాఖలు చేశారు.

త్వరత్వరగా సంస్కరణలను అమలు జరిపి దేశానికి ఐశ్వర్య సౌభాగ్యా...

(2-వ పేజీ చూడుడు)

## కృష్ణానది ఆనకట్ట మరమ్మతు పబ్లిక్ వర్క్సు మంత్రికి సూపరెంటెండింగ్ ఇంజనీర్ వివరణ

(స్వకీయవిలేఖరి)

విజయవాడ, సెప్టెం 17: మద్రాసు పబ్లిక్ వర్క్సుశాఖా మంత్రి యస్. రంగారెడ్డిగారు, ఈ ఉదయం మదరాసు నుంచి యిక్కడికి వచ్చారు. కృష్ణ ఆనకట్టకు సంభవించిన నష్టాన్ని గురించి స్వయంగా చూచి తెలుసుకొనేందుకు మంత్రి రంగారెడ్డిగారు, కృష్ణా జిల్లా కలెక్టరు శ్రీనివాసన్, ఈస్టరన్ డివిజన్ ఎక్జిక్యూటివ్ ఇంజనీరు పార్థసారథి, విజయవాడ పోలీసు సూపరింటెండెంటు యం. ఇ. రెడ్డి, తదితర పబ్లిక్ వర్క్సు, రెవెన్యూ అధికార్లతో కలసి వెళ్ళారు. రంగారెడ్డి గారిని, సింహాచలంలో, సద అవతలి వైపున [సీతానగరం వైపు] తీసుకొని వెళ్ళారు. ఆనకట్టకు గండిపడింది అక్కడే. సూపరెంటెండింగ్ ఇంజనీర్ కేశవరావు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు జి. ఎ. నరసింహారావు, తదితరులు, మంత్రి గారికి అక్కడ స్వాగత మిచ్చారు. మే నెలలో ఆకస్మికంగా వచ్చిన వరదలవల్ల ఆనకట్టకు కల్గిన నష్టాన్ని గురించి, యిప్పుడు సీతా నగరం వైపు పడిన గండిని గురించి, కేశవరావుగారు మంత్రిగారికి వివరించారు. "ప్రస్తుతం సీతానగరం వైపు పడిన గండి దాదాపు 100 అడుగుల వెడల్పు 25 అడుగుల లోతు ఉంటుంది. ఆనకట్ట యింకా దెబ్బతినకుండా మరమ్మతులు పనులను, త్వరగా పూర్తిచేయడానికి శాయశక్తులా కృషి చేస్తున్నాము." అని కేశవరావుగారు చెప్పారు. రాళ్లు యిసుక నింపిన పీపాలు మొదలైన వాటిని నీటిలో ముంచి ప్రవాహాన్ని ప్రక్కకు మళ్ళిస్తూ కట్టే బఫర్ ఆనకట్ట విషయం మంత్రి గారికి తెలియజేస్తూ యింతవరకూ 17 ఓడెపడవలలో ఇసుక రాళ్లు నింపి, గండిపడ్డచోటుకు ఎగువన ముంచి వట్టు యింతవరకు పని అనుకున్నట్లు సక్రమంగా జరిగినట్లు చెప్పారు.

ఆనకట్ట మరమ్మతులను త్వరగా ముగించి, డెల్టాలో పంటలు కాపాడాలనే పట్టుదలతో వున్నామని, రోజూ పెయ్యమంది పనివాళ్ళు, పనిచేస్తున్నారని, ఎక్కడ దొరికితే అక్కడినుంచి అట్లా సాంకేతిక సహాయమును తెప్పిస్తున్నామని చెప్పారు.

విద్యుచ్ఛక్తి సూపరెంటెండింగు ఇంజనీరు పప్పు వెంకట్రామయ్యగారు రాత్రి, పగలు మరమ్మతు పనులకు కావలసిన విద్యుచ్ఛక్తి నిరంతరం సరఫరా అయ్యేటట్లు చూస్తున్నారు. విజయవాడ మున్సిపల్ హెల్త్ ఆఫీసరు సి. సత్యనారాయణగారు కూలీల ఆరోగ్య విషయమై శ్రద్ధ తీసుకొంటున్నారు.

## ఉత్తమ భారత పత్రికలకు బంగారు పతకాల బహూమానము

న్యూఢిల్లీ, సెప్టెంబరు 17: అత్యుత్తమమైన భారత దైనిక, వార, మాస పత్రికలకు లేదా సచిత్ర పత్రికలకు బంగారు పతకాలను బహూకరించే నిర్ణయాన్ని విద్యా, పత్రికా రచన కేంద్రం వారు ప్రకటించారు. పత్రికా సంపాదకీయములు, భాష, సాధారణ్యము ముద్రణలనుబట్టి అత్యుత్తమ శ్రేణికి చెందిన మూడు పత్రికలకు ఈ కేంద్రం మూడు బంగారు పతకాలు బహూకరిస్తుంది. దేశభాషా సచిత్ర పత్రికల ఆంగ్ల దినపత్రిక పరీక్షాసంఘ నిర్ణయము ఆధారపడి వుంటుంది. ఇవిగాక యీ కేంద్రము దేశీయ భాషలైన హిందీ, మరాఠీ, ఉర్దూ, గుజరాతీ, బెంగాలీ, తెలుగు, తమిళ భాషలలో అత్యుత్తమమైన వార్తా పత్రిక లేక సచిత్ర పత్రికకు భాషకు ఒక్కటి చొప్పున 7 బంగారు పతకాలు బహూకరిస్తుంది.

## తప్పించుకు తిరుగుతూ వుండిన దౌర్జన్యవాది

### హైద్రాబాదు పోలీసులకు పట్టుబడి

హైదరాబాదు సెప్టెంబరు 16: లంబాడా లక్ష్మి అనే ఒక దౌర్జన్యవాదిని పోలీసులు మొన్న 14 వ తేదీనాడు నల్గొండజిల్లా చిట్యాల ఠాణా గ్రామంలో అరెస్టుచేసినట్లు ఇవాళ ఇక్కడ అధికారరీత్యా తెలియవచ్చింది.

ఖూనీలు, దోపిడీలు, ఇండ్లు తగలబెట్టడం ఇత్యాదిపలుకేసుల సందర్భంలో పోలీసులు ఈమనిమిత్తమై చిరకాలంగా వెతుకులాడుతూ వుండినారట.

## నూనె సమస్యా పరిష్కారానికి పర్షియా పంచసూత్ర పథకం

### క్షుద్బాధ

కాశీ, సెప్టెంబరు 15: నేటి ఉదయం ఒక చేనేతగాడు తన కుటుంబాన్ని హత్య చేయాలని ప్రయత్నిమున తన రెండేండ్ల కుమార్తెను, భార్యను, 6 ఏండ్ల కుమారుణ్ణి కత్తితో పొడిచి, తరువాత తన గొంతు కోసుకున్నాడు. కుమార్తె ఆసుపత్రిలో మరణించింది, తక్కినవారు ఆసుపత్రిలో వున్నారు. కాశీ పట్టుపరిశ్రమ మాంద్యంవల్ల తనభర్తకు పని పోయిందని వారంనుండి తమకు తిండిలేదని, రాత్రి ఆహారం తీసుకొనిరాకుండా యింటికి వచ్చిన ప్పుడు కోపంవచ్చి కేకలు వేశాడని భార్య చెప్పింది. నేటి ఉదయం చేనేతగాడు ఈ అఘాయిత్యం చేశాడు. పెళ్లాం యేడ్పు విని పొరుగువారు పరిగెత్తుకొనివచ్చి గాయపడినవారందరిని ఆసుపత్రికి చేర్చారు. కుమార్తె తరువాత చనిపోయింది.

### మజ్లీస్‌లో మొస్సాదిక్ వివరణ

#### ప్రధాన మంత్రిపై సెనేట్ విశ్వాస ప్రకటన

టెహరాన్, సెప్టెంబరు 16: పెట్రోలు సమస్యా పరిష్కారానికి అయిదు అంశాలతో కూడిన ఎదురు ప్రతిపాదన ఒకటి చేస్తూ, పర్షియా ప్రధాని డా॥ మహమ్మద్ మొసాదిక్ మజ్లీసను ఈవేళ తనపై విశ్వాసాన్ని ప్రకటించవలసిందిగా అర్థించాడు. మజ్లీస్ అంతట ప్రధానమంత్రి పట్ల సంపూర్ణమైన విశ్వాసాన్ని ప్రకటిస్తూ ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేసింది.

పెట్రోలు తగాదా పరిష్కారానికి ఇటీవల జరిగిన రాయబారాలు, చర్చిల్ ట్రూమన్‌లు సంయుక్తంగా చేసిన ప్రతిపాదన వీటిని గురించి మొసాదిక్ పార్లమెంటుకు ఒక సమగ్రమైన నివేదిక దాఖలు చేసి, "పర్షియా న్యాయసమ్మతమైన హక్కులను నిలబెట్టటం కోసం అవసరమైతే బ్రిటన్‌తో సర్వమైన సంబంధాలను తెగతెంపులు చేసుకోడానికైనా తాను సిద్ధంగా వున్నాననీ, తన ఈ వైఖరిని మజ్లీస్ ఆమోదించేదీ లేందీ విశ్వాస తీర్మానం రూపంగా స్పష్టం చేయాలసిందనీ ప్రధాన మంత్రి కోరాడు. డా॥ మొసాదిక్ సమావేశానికి తాను హాజరుకాలేదు; ఆయనకు బదులుగా మరొకరు నివేదికను పార్లమెంటులో చదివి విన్పించారు. పార్లమెంటు స్పీకరు కషానీ కూడా సమావేశానికి రాలేదు; ఆయనకు బదులుగా డిప్యూటీ స్పీకరు సమావేశానికి అధ్యక్షతవహించారు. చర్చిల్ ట్రూమన్ ప్రతిపాదనలు తమకు ఏంత మాత్రం అంగీకారయోగ్యం కావని మొసాదిక్ తన నివేదికలో ఆదిలోనే స్పష్టంచేశాడు. నష్టపరిహార సమస్యను పర్షియన్ కోర్టులకు వదలడం బ్రిటిషు ప్రభుత్వానికంత అయిష్టంగా వున్నట్లయితే, ఈ క్రింది షరతులమీద యీ వ్యవహారాన్ని, వారు కోరుతున్న ప్రకారం అంతర్జాతీయకోర్టు విచారణకు నివేదించినా తమకు కేమీ అభ్యంతరం లేదని అంటూ మొసాదిక్ రాజీ ప్రతిపాదన ఒకటి చేశాడు. ఈ అంతర్జాతీయ కోర్టుకు వ్యవహారాన్ని నివేదించడానికి ఆయన తన ప్రతిపాదనలో విధించిన షరతులు ఇవి:

ఒకటి అబడాన్‌లో ఆంగ్లో ఇరానియన్ ఆయిల్ కంపెనీకి గల యంత్రాగారాల ముటుకు మాత్రమే నష్ట పరిహారం ఇవ్వబడుతుంది.

రెండు. 1933-1947 ఈ లోను వచ్చిన తగాదాలు క్లెయిములు అన్నీ కూడా 1933 వ సంవత్సరం ఒడంబడిక ప్రకారం పరిష్కారం చేసుకోవాలి.

మూడు. 1948-1951 ఏప్రిల్ ఈ లోపు వచ్చిన తగాదాలు క్లెయిములు

(2 వ పేజీ చూడుడు)

### ఇండో-చైనాకు న్యూజిలాండ్ ఆయుధాలు

#### ఫ్రాన్సుకు న్యూజిలాండ్ వత్తాసు

వెలింగ్టన్, సెప్టెంబరు 16: మిగులుగా వున్న ఆయుధాలను, యంత్రసామగ్రిని న్యూజిలాండ్ ఇండో-చైనాలోనివున్న ఫ్రెంచి అధికారులకు అందజేయ న్యూజిలాండ్ అంగీకరించిందని విదేశాంగ శాఖ మంత్రి క్లిఫ్టన్ వెబ్ నేడు ప్రకటించారు.

"1800 సన్న తుపాకులను, 600 మర ఫిరంగులను, వివిధ రకాల 750 వేల మందు గుండును, ఉచితంగా ఫ్రెంచి అధికారులు మార్చి నాటికి మేము చేశాయి" అని ఆయన అన్నాడు. ఇవి అమెరికా అనువు కర్రలు సాగు నీటిలో చాలా భాగము యిదివరకే సింగపూరుకు తరలించ బడినాయి.

## గ్రామాల్లో ఉత్పత్తిసంఘాల స్థాపనకు ప్రభుత్వ నిర్ణయం

మదరాసు, సెప్టెంబరు 17: గ్రామ వుత్పత్తి సంఘాలను ఏర్పాటుచేయుటకు మదరాసు ప్రభుత్వం నిశ్చయించింది.

ఇవ్వాళ మంత్రివర్గ సమావేశానంతరం ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి ఈ విషయాన్ని పత్రికా ప్రతినిధులకు వెల్లడిస్తూ "గ్రామ వుత్పత్తి సంఘాలను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది. ప్రస్తుతానికి ఈ సంఘముల నిర్మాణం గ్రామ ఉద్యోగులు, కరణాలు, ప్రస్తుతం అమలులో వున్న పంచాయతీబోర్డు, సహకార సంఘముల సభ్యులు, వ్యవసాయశాఖ వారు ఏర్పాటు చేసినట్టి గ్రామ సంఘాల ప్రతినిధులతో నాయకత్వ పద్ధతిని ఏర్పాటు చేయబడుతాయని" అన్నారు.

రచనా సంఘంవారు ఉద్దేశించిన పరిపూర్ణ గ్రామోత్పత్తి సంఘాల నిర్మాణమునకు రాష్ట్రమంతటా పంచాయతీల ఎన్నికలు పూర్తిఅయ్యేవరకు వేచివుండవలసి వుంటుందనికూడా ముఖ్యమంత్రి అన్నారు.

ఈ గ్రామ వుత్పత్తి సంఘాలు గ్రామంలో వుత్పత్తిని పెంపొందించుటను సంబంధించిన యోజనలన్నిటిని పరిశీలించగలవు. ఈ సంఘాలకు ఆయా గ్రామ ముఖ్య ఉద్యోగి కార్యదర్శిగ వ్యవహరించగలడనీ పంచాయతీ బోర్డు లేకపోయినా ప్రతి గ్రామమునకు గ్రామ వుత్పత్తి సంఘం ఏర్పాటుచేయడం జరుగుతుందని కూడా ముఖ్యమంత్రి విశదపర్చారు.

### జనీవా సంభాషణల వైఫల్యము

#### ఆజాద్‌కాశ్మీర్ మాజీనాయకుని బెదరింపు

లాహోరు, సెప్టెంబరు 16: జనీవా సంభాషణలు వైఫల్యము, పాకిస్థానుకు, ఆజాద్ కాశ్మీరుకు సవాలు, పాకిస్థాన్ ప్రజలు, ఆజాద్ కాశ్మీర్ ప్రజలు ఈ సవాలును వెంటనే అంగీకరించాలి. అని ఆజాద్ కాశ్మీరు మాజీ అధ్యక్షుడు సర్దార్ మహమ్మద్ ఇబ్రహీం యిక్కడ ఒక సభలో ఉపన్యసిస్తూ అన్నాడు. యుద్ధవిరామసంధి విషయమై చేసుకొన్న అంతర్జాతీయ ఒప్పందాలను విసర్జించాలని అతడు పాకిస్థానుకు విజ్ఞప్తిచేశాడు.

#### పాక్ పత్రిక వ్యాఖ్య

జనీవా సంభాషణల వైఫల్యానికి పాకిస్థాన్ అంతరంగిక అనైక్యము, విచ్ఛిత్తి కారణమని కరాచీ పత్రిక సివిల్ మిలిటరీ గజెట్ వ్రాసింది 'సమితితో సంబంధాలు తెగతెంపులు చేసుకొని తిరిగి యుద్ధం ప్రారంభించాలా? న్యాయం పొందడానికి సోవియట్ సహాయం కోరాలా? అనే ప్రశ్న వేసుకొని యిట్టి నిర్ణయం చేసేముందు అన్ని పార్టీలవారి సమావేశం జరపాలని పత్రిక సూచిస్తున్నది.

### రాయలసీమకు సహాయం: మద్రాసు మంత్రివర్గం చర్చలు

మదరాసు, సెప్టెంబరు 17: రాయలసీమలో ఏర్పడిన వర్షాభావము గురించీ సహాయ కార్యక్రమం నిర్వహణ గురించీ మదరాసు మంత్రివర్గం ఇవ్వాళ సమావేశమైనప్పుడు చర్చించింది.

ఈ విషయాన్ని పత్రికా ప్రతినిధులకు తెలుపుతూ "రాయలసీమలో ఏర్పడిన వర్షాభావము గురించీ సహాయ కార్యక్రమములను కొనసాగించుట గురించి దానితో గల ఆర్థిక సాధకబాధకములను గురించి కూడా మంత్రివర్గం చర్చించిందని" ముఖ్యమంత్రి చెప్పారు.

### పాకిస్తాన్లో హిందువులువదిలి వచ్చిన ఆస్తిరు 500 కోట్లు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 17: హిందువులు, సిక్కులు దాదాపు 500 కోట్ల రూపాయల ఆస్తిని ప. పాకిస్తాన్ పట్టణాల్లో వదలివచ్చారు. ముస్లిమ్ కాందిశీకులు భారతదేశంలో వదలిపెట్టిపెళ్లిన ఆస్తి విలువ దాదాపు 100 కోట్ల రూపాయలు మాత్రమే. ఈ లెక్కలను పునరుద్ధరణశాఖవారు తెలియజేశారు. గ్రామాల్లో వదలిపెట్టివచ్చిన ఆస్తి లెక్క యింకా తేలలేదు.

దసరాకు ప్రత్యేక ఆకర్షణ ★ నేటినుండే ప్రారంభం
అశోక్ & రాజకుమారి (మద్రాసు)
ఒక నూతన ఆశ్చర్యకరమైన ప్రపంచము; 1001 రమ్యమైన రమణీయ దృశ్యములు
(ధనుడు నిర్మింపగలట్టియు భావనయే చిత్రింపగలట్టియు అద్భుతమైన ఇంద్రజాలము
చంద్రకళ పిక్చర్సువారి కల్పన _ ఇంద్రజాలము మిళితమైన జానపదచిత్రము




తారాగణము: *గీతాబాలి*సజ్జన్*నర్గీస్*గోప్*కుల్ దీప్*శామ్‌సన్, ఆర్తకార లలిత్ కపూర్
నిర్మాత, దర్శకుడు: ధీరుభాయి దేశాయి
సంగీతము: ఖుర్షీద్ అన్వార్ (పాకిస్తాన్ కిపి)
పాటలు: హస్రత్ జయపురి
ప్రతిదినము 3 ఆటలు: మ॥ 3, సా॥ 6-15, రా॥ 9-30. 2-8-0 & 1-14-0 లకు టిక్కెట్లపై అడ్వాన్సు బుక్కింగు ఏర్పాటు ఉ॥ 9 నుండి మ॥ 12 గం॥ వరకు గలవు. కాంప్లిమెంటరీలన్నియు రద్దు చేయబడినవి.
నేటినుండి: సెంట్రల్ - ఏలూరు, ట్రాకీ - గుంటూరు, సెంట్రల్ - తిరుచ్చి, ... - నెల్లూరు
19-9-52 నుండి ఎక్సెల్సియర్ - వెంకటగిరి సిటీ. (ప్రతిదినము 3 ఆటలు)
త్వరలో: హైదరాబాదు, బెంగుళూరు, కోయంబత్తూరు, విజయవాడ, మైసూరు, రాజమండ్రి, విశాఖపట్టణం, కాకినాడ
జనరల్ ఫిలిమ్స్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ వారి గొప్ప విడుదల

